Registered No. M-4484.

# యుద్ధ సంచిక.

వాల్యూం II.] 1942 వ సం॥ జూలై నెల 3 వ తేది శుక్రవారం [నె 26 రు.

## జయించే అవకాశం యిపుడే ఎక్కువ

### చర్చిలు - రూజువెల్టు ప్రకటన.

చర్చిలుగారు లండనుకు తిరిగివచ్చిన తర్వాత చేసిన ప్రకటనలో యుద్ధవిజయ పద్ధతుల గురించి సంయుక్త రాజ్యాలన్నీ మునుపటికంటె ఇప్పుడు ఎక్కువ ఏకాభిప్రాయముతో నున్నవని తెలిపిరి. యునైటెడు దేశములకు ఇప్పటికినీ రవాణాసమస్యయే పెద్దదిగా నున్నదనిరి. శత్రు జలాంతర్గాముల దాడివల్ల సరుకు నావల నష్టం ఎక్కువగా నున్నా, చర్చల ఫలితంగా ఉభయ నౌకాదళములు ఆ నష్టములను తగ్గించగలవని ఆశించిరి.

బ్రిటిషు ప్రధాని చర్చిలుగారు లండనుకు తిరిగి వచ్చినమీదట ఈ క్రింది ప్రకటన వెలువడినది —

" అమెరికా అధ్యక్షుడును, బ్రిటిషు ప్రధానియు ఒకవారం దినములు జరిపిన చర్చలలో ప్రతి ఖండమున ప్రతి సముద్రమున సంయుక్త రాజ్యాలవారు సాగించుచున్న యుద్ధమునకు సంబంధించిన అన్ని పెద్ద సమస్యలు పూర్తిగా చర్చింపబడినవి. మనకుగల అనుకూల, ప్రతికూల విషయములు అన్నిటిని పూర్తిగా గుర్తించినాము. మన కార్య భారమును తగ్గించి చెప్పుటలేదు. మన శత్రువుల బలము, తెలివిని బాగా గ్రహించియే, మేము చర్చలను సాగించినాము. అన్నిరకాల ఆయుధ, మందుగుండు సామగ్రి విషయంలో మేము జరిపిన పరిశీలనబట్టి పరిస్థితి మొత్తానికి ఆశాపూరితంగా కనుపించుచున్నది. ఇంతకు ముందు అనుకొన్న విధంగా ప్రతినెల ఉత్పత్తి అత్యధికంగా జరగలేదు. కాని స్వరిలోనే అనకొన్నంత ఉత్పత్తి కాగలదు. యుద్ధం ప్రపంచం అన్ని ప్రాంతాలకు వ్యాపించి విస్తృతమైనందున సేనలను, సామగ్రి, ఆయుధములను రవాణా చేయడమే ఇప్పటికిని సంయుక్త రాజ్యములకు పెద్ద సమస్యగానున్నది.

### నౌకా నష్టములు.

" అక్సిసువారు జలాంతర్గామి యుద్ధమును సాగించుచు, సరుకులు తీసుకొనిపోయే ఓడలను ఎక్కువగా ముంచుచున్నను, కొత్తనావల ఉత్పత్తి నెలనెలకు ఎక్కువగుచున్నది. ఈ సమాలోచనలో ఆలోచించి నిర్ణయింపబడిన చర్యలవల్ల, వర్తకనావల నష్టమును మన ఉభయ నౌకాదళములు తగ్గించునని ఆశించుచున్నాము. యుద్ధమున గెలుచుటకు చేసిన ఆలోచనలో సంయుక్త రాజ్యాములు నేడున్నంత విపులంగా, హృదయపూర్వకముగా ఏకాభిప్రాయంతో మునుపెప్పుడును ఉండియుండలేదు.

### రష్యా, చీనా ప్రతిఘటన.

" జర్మనులు జరుపుచున్న ముఖ్యదాడిని రష్యనులు ప్రతిఘటించుచున్న విధాన్ని మేము గుర్తించి, ప్రశంసించుచున్నాము. చైనా సైన్యముయొక్క అద్భుత ప్రతిఘటనకు మేము ఉప్పొంగుచున్నాము.

" జపానుపైన, చైనాకు సహాయంగా అనుసరింపదగు పద్ధతులగురించి మా సైనిక సలహాదార్లతో వివరంగా చర్చించితిమి. మా ఆలోచనలను బయిటపెట్ట వీలులేదు. కాని, ముందుసాగింపవలసిన యుద్ధచర్యలనుగురించి మేము మా సైనిక సలహాదార్లతో వివరంగా చర్చించినాము; ఆ చర్చల ఫలితంగా జర్మనుబలము రష్యాపై దాడినుండి మరల్పబడగలదు; అని చెప్పవచ్చును.

" ప్రధాని, అమెరికా అధ్యక్షుడును ఇంతకుముందు రెండుసార్లు, తొలిసారి 1941 ఆగస్టులో, రెండోసారి 1941 డిసంబరులో కలుసుకొన్నారు. ఆ ఆగస్టు, ఆ డిసంబరులలోకంటె యుద్ధ పరిస్థితి మొత్తం కలయజూచి చూస్తే విజయమునకు యిప్పుడే ఎక్కువ అనుకూలంగా నున్నదని వారిద్దరు నిస్సంకోచంగా నమ్ముచున్నారు."

# యుద్ధ విమర్శ - విశేషాలు

## టొబ్రుకు పతనమునకు కారణములు - తాత్కాలిక ఫలోటు - ఈజిప్టు యుద్ధము.

లిబియాలోని నష్ట మంత ఎక్కువయినది కాదని చెప్పుటకు వీలులేదు. కాని అంతమాత్ర మున గుండె జార్చుకోవలసిన పనిలేదని విషయ మెరింగినవారు నమ్మకంగా తెల్పుచున్నారు.

టొబ్రుకు పతనం.

టొబ్రుకు పతనం పడమటి ఎడారిలో మిత్ర మండలి సేనలకు ఘట్టి దెబ్బ యని అంగీకరించబడెను. వారి కచట మంచి శిబిరం పోయి నది. పెక్కువేలమందిని చాల యుద్ధ పరికరాలు గోల్పోయిరి. వెనుకనుండు సైన్యాలతో సం పర్కం ఏర్పరచుకొనుటకు శత్రువుకి యిచటి హార్బరు బాగా సహాయపడును. శత్రువుయొక్క నిరంతర దాడిని ఏడు నెలల పాటు టొబ్రుకు నిభాయించుకోగల్గెను. 1941 వ సం॥ ఏప్రిలు నుండి నవంబరువరకు శత్రువిమానాలను, నేల సైన్యాలను తరుమగొట్టుచు, జయింపరాని దుర్గ మనిపించుకొనెను. అయినను, ఆధునిక ఆయుధ యుద్ధ విధానమునందు జయింపరాని సైన్యాలు గాని, వశముకాని స్థలములుగాని లేవని చెప్ప వచ్చును. అవి లొంగుట వాటిపై దాడిచేయు యంత్రసాధనముల సంఖ్యనుబట్టి యుండును. జర్మను సైన్యాలు అజేయములను మాట రష్యను ఎఱ్ఱసైన్యములు చాలకాలం క్రిందటనే రుజువుచేసి నవి. రోమెలు సేనానియొక్క సైన్యాలకుగల అమితమగు యంత్ర సామగ్రియే లిబియాలో మిత్రమండలి రక్షణలను చేదించగల్గెను.

బాగా చితికిన పూరు.

టొబ్రుకు నగరమును 1911 వ సం॥ నుండి ఇటలీవారు రక్షించుచుండిరి. కాని జనరలు వావెలుగారు 36 గంటలలో దాన్ని వశపరచు కోగల్గిరి. 1941 వ సం॥ జనవరి 22 వ తేదీన అచట 20,000 ఇటలీ ఖైదీలు సైనికులుగ పట్టు బడిరి. వారిలో సేనానాయకులు, ఇరువురు జనరల్సు, ఒక అడ్మిరలుకూడ నుండిరి, పెక్కుండ్రు సీనియరు ఉద్యోగులు నుండిరి. ఇపుడు ఇటలీ ఖైదీల మొత్తం సంఖ్య 100,000. 1941 వ సం॥ ఏప్రిలు మాసంలో గ్రీసునకు అధికంగా సేనలు పంపవలసివచ్చి నందున టొబ్రుకులో సైనికుల సంఖ్య తగ్గినది. అందుచే సంఖ్యలో అధికంగానున్న శత్రువుల ముందు మిత్రమండలి సేనలు వెనుకకు తగ్గవలసి వచ్చెను. అయినను, టొబ్రుకును వదలకూడ దని జనరలు వావెలుగారు నిశ్చయించిరి. టొబ్రు కు నగరాన్ని ఏడు నెలలవరకు భారతీయులు, బ్రిటిషు ఆస్ట్రేలియను, పోల్సు జెక్కుగల సమిష్టి సైన్యం రక్షించుచుండెను. టొబ్రుకు 1,000 పైగా విమానదాడులను ఓర్చుకొనెను. మధ్య ప్రాచ్యమునందు అత్యధికంగా శత్రు బాంబులకు గురియైన స్థలమని పేరుబడెను. అయితే టొబ్రుకు అపుడే ఎందుకు పడిపోలేదని అడుగ వచ్చును. కారణం, జర్మనులు అపుడు ఎక్కువ ఆయుధ యంత్రసామగ్రి ఆ నగరంపై పంపలేక పోవుటే.

సప్లై కేంద్రము.

ముట్టడియందున్న కాలంలో టొబ్రుకు ఏమి చేయగల్గెను,అనిఅడుగవచ్చు. శత్రు సేనలకు సప్లైలు చేర కుండా నిరోధించకల్గుచుండె ను. శత్రువులు టొబ్రుకు చుట్టు 40 మైళ్లలో కాచి చుట్టవేసియుండిరి.

1941 వ సం॥ నవంబరు 18 వ తేదీన బ్రిటిషు సేనాని అచినులేకుగారు తిరిగి లిబియాలో దాడి ప్రారంభించి, తొమ్మిది రోజులలో ముట్టవేసిన శత్రు సేనల వలయమును ఛేదించగల్గెను. అప్ప టినుండి టొబ్రుకు రేవు బ్రిటిషువారి 8 వ సేనకు దూరపు సప్లై డిపోగా నుండెను. ఏప్రిలు 12 నుండి డిశంబరు 10 వరకు బ్రిటిషు నౌకాదళం 29,000 సైనికులను, 34,000 టన్నుల సామా నులను ఆ నగరంలో చేర్చగల్గెను. అనగా సగటున దినమునకు 142 టన్నులు రవానా చేసింది. 33,000 మంది ప్రజను ఆ వూరు నుండి బయటకు భద్రంగా నౌకాదళం పంపగల్గెను. 1½ సంవత్సరం మన చేతులో నున్నాక యిది తిరిగి శత్రువశమయింది. జర్మను సేనాని రోమెలు యీసారి తిరుగుదాడి ప్రారంభించిన రెండవనాడే టొబ్రుకుపైబడదలచెను; కాని మూడు

వారాలు యుద్ధం చేస్తేగాని సాధించలేకపోయెను. ఈ విజయం ఆతనికి చాల నష్టం కలుగచేసెను.

చర్చిల్ అభిప్రాయం.

టొబ్రుకు శత్రువశమగుటను గూర్చి ప్రధాన మంత్రి చర్చిలుగారు ప్రసంగిస్తు, ఇది ఈజిప్టు యుద్ధానికి సంబంధంలేని తాత్కాలిక పరాజయమనిరి. 8 వ సైన్యం సురక్షితంగా ఈజిప్టు సరిహద్దు చేరుకుంది. ఇపుడు మార్గాలుకూడ తగ్గిపోయి కేంద్రానికి యుద్ధరంగానికి దగ్గరయినందున రక్షణబలంకూడ యిదివరకుకన్న ఎక్కువ వృద్ధియైనది. ఈ 8 వ సైన్యం మొదటి చుట్టులో గెల్చింది. రెండోచుట్టులో ఓడింది. ఉభయులు ఎంత యెక్కువ ఆయుధ సామగ్రి తెచ్చి యుద్ధరంగంలో పెట్టగలరో దానిపై యుద్ధ ఫలితం ఆధారపడియుండును.

బ్రిటనులో ఉత్పత్తి శాఖ మంత్రి ఆలివరు లిటిలుటనుగారు, లిబియాయొక్క గుణపాఠమును మరువలేమని చెప్పిరి. "యుద్ధం ముగియక తప్పదు, కాని యీలోగా చాల కష్టాలు పడవలసియుండును. ఇతర కష్టాలను భరించినట్లే దీన్ని గూడ భరించెదమనిరి. ఈజిప్టుకొరకు యుద్ధం మొదలయిన రెండు సంవత్సరాలకు యీ కష్టం వచ్చినా, యిది ముందనుకోని క్రొత్త విషయం కాదు. టొబ్రుకు బ్రిటిషువారి ముఖ్య శిబిరాలలో నొకటిగా యుండెను, కాని అంతకుముందు అక్షరాజ్యాల వశమునందుండెను, అప్పుడును ఈజిప్టు భద్రముగ రక్షింపబడెను ; యికముందు గూడ రక్షింపబడును.

గత కొద్ది రోజులలో ఈజిప్టునందు భీకర యుద్ధము జరుగుచున్నది. శత్రువు తమను చుట్టివేయకుండ తప్పించుకొనుటకై మిత్రమండలి సేనలు కొన్ని స్థలములను విడచిపోయినవి. ఇది యుక్తికొరకు చేసినదేగాని పారిపోవుట గాదు. ఈ ప్రాంతంలో జరుగుచున్న యుద్ధం అంతా కలయబారి చూచుటకు వీలులేదు. అతి విశాల ప్రదేశమునందు అచ్చటచ్చట చెదరియున్న సైనిక దళములు పోరాడుచున్నవి. మెర్సా మట్రూపురము ఖాళీచేసినట్లు ప్రకటించబడెను. న్యూజిలండు సైనికులు గత డిశంబరునుండి యుద్ధంలో పాల్గొననటువంటివారు యిపుడు పాల్గొన్నారని తెలుపబడెను. సముద్ర తీరమునందున్న సన్నని యుద్ధరంగము, విస్తరింపజేయుటకు మిత్రమండలివారు ప్రయత్నించి, ఆ ప్రకారం చేయగగ్లుచున్నారని యీ ప్రకటనలు తెల్పుచున్నవి. ఫలితం వెంటనే నిర్ణయంకాదనియు, రెండు పక్షాలవారు చాల నష్టపోవలసియుండుననియు భారతీయ సైన్యం వెంటానున్న విమర్శకుడు తెల్పుచున్నాడు.

ఈజిప్టు ప్రధాని ప్రకటన.

ఈ యుద్ధంయెడల ఈజిప్టు ప్రభుత్వ వైఖరిని తిరిగి వేరొకసారి ప్రధాని నహాసు పాషాగారు ఈజిప్టు పార్లమెంటులో తెలిపిరి. ఈజిప్టులో సైన్యాన్ని సమీకరించి అక్షరాజ్యాలపై యుద్ధం ప్రకటింప బ్రిటిషు ప్రభుత్వంకోరినదను వదంతులను అతను ఖండించెను. ఈ వదంతులను బహుశః అక్షరాజ్యాల ఏజంటులే కల్పించియుందురు. శత్రువుల గూఢచారులగూర్చి ప్రజలకు హెచ్చరించి వారుకఠినముగా శిక్షింపబడుదురనిరి. ఇటువంటి ప్రచారము చేయువారిని నిరశించిరి. ఈజిప్టు తటస్థంగా నుండునని రెండు నెలల క్రిందట ప్రధాని ప్రకటించియుండెను. యుద్ధంనుండి తప్పించుకొని, ఈజిప్టు సిపాయిలు కార్మికులు ఎటువంటి యుద్ధకార్యములందును పాల్గొనకుండునట్లు చేయుటే తమ ప్రభుత్వోద్దేశమనియుండిరి. కాని బ్రిటిషువారు వారిమిత్రుల సైన్యాలు ప్రజా ప్రతినిధి ప్రభుత్వములను రక్షించుటకై ఈజిప్టు దేశంలో నుండునంతకాలం వారిని రక్షించుటకు తగుచర్య తీసుకొనబడుననిరి. ఈ సైన్యాలకు చెడుగుచేయకుండ ఈజిప్టు దేశీయులనుగాని, విదేశీయులనుగాని, వారించెదమని అతడనెను. అపుడిట్లు చెప్పిరి :—" ఇంగ్లాండు ఈజిప్టులకుగల సఖ్యత ఒడంబడికను నేను అక్షరాలామన్నింతును. మన మిత్రదేశముయొక్క సైనిక భద్రతకు భంగం కలుగునట్లు దేశీయుడెవడు ప్రయత్నించినను సహింపను. ప్రజా ప్రతినిధి ప్రభుత్వములను స్వాతంత్ర్యమును కాపాడుటకై, యిపుడు యుద్ధం చేయుచున్నవారెవ్వరికిగూడ ఆందోళన కలిగించు కార్యమేదీ చేయము. అదే నాయుద్దేశము. మా మిత్ర దేశములు యీ విషయం తెలుసుకోవాలి. మన మిత్రదేశపు సైన్యాలు వారి మిత్రుల సైన్యాలు, మాతృ దేశానికి అతి దూరంగా అనేక కష్టాలు పడుచున్న యీ సమయంలో యీ విషయం తెలుసుకోవలెనని కోరెదను."

ఈ భావమునే ఈజిప్టు ప్రధాని వేరొకసారి స్పష్టంగా తెలుపుటచేత, శత్రు రాజ్యాలు ఈజిప్టుకి

ప్రతికూలంగా చేయుచున్న దుష్టప్రచారం ఖండిం చుటకు ఎంతయు తోడ్పడును.

భారతదేశానికి వెలుపల సరిహద్దులలో నొకటి ఈజిప్టు. అచట యిపుడు జరుగుచున్న యుద్ధంలో భారతీయ సేనలు ప్రతి భావంత ముగ పాల్గొనుచున్నవి. భారతీయ యోధులు యుద్ధం చేసిచేసి అలసియున్నవారు, లిబియా యుద్ధంలో గెలుపోటముల మధ్య ఉగ్రూతలూగిన నిపుణ సైనికులు, యిపుడు నైలు లోయను రక్షించుటయందు గౌరవప్రదముగ పనిచేయుచున్నారు. వారితోబాటు, ఇండియానుండి క్రొత్తగావచ్చి, యింకను శత్రువుతో కత్తికలపక

ఈజిప్టులో భారతీయ సైన్యాలు.

తొందరపడుచున్నవారునూ గలరు. ఈ సైనికులు చీకుచింతలేక ఉత్సాహంగానున్నారు అని సైన్యంవెంటనున్న విమర్శకుడు తెలిపెను. అదృష్టం ఎట్లున్నా వీరు మాత్రం తమ యునికి సార్థకం చేసుకొందురు. శత్రువు సూయజు కాల్వకు పోలేనంత చావుదెబ్బను వీరు కొట్టగలరు. ఇరాకులో, ఇరానులో, సిరియాలో ఎక్కడకుపోయిన భారతీయ సైనికులు ప్రశంసలనే బడసిరి. అట్లే యిపుడు ఈజిప్టు యుద్ధమునందు గూడ వారు పేరు ప్రతిష్ఠలను బడయగలరు. ఈజిప్టు యుద్ధం యీ సమరంలో చాల ముఖ్యమైనది.

# భారతీయ నౌకాదళము.

భారతీయ నౌకాదళము (రాయలు ఇండియను నేవీ) అతివడిగా విస్తరింపబడుచున్నది. దీనిలో క్రొత్తగ టార్పెడో స్కూలు ఒకటి కట్టుచున్నారు.

ఈ స్కూలునందు కేవలం టార్పెడోలను ఉపయోగించుట మాత్రమేగాక, జలాంతర్గాములను ముంచే డెప్తు చార్జీలుపయోగించుట, మందుగనులు నీటిలో నాటుట, తొలగించుట, ఎలక్ట్రికు ఏర్పాటులన్ని నిర్వహించుట, యివన్నిగూడ నేర్పబడును. ఈ మూడు విషయముల గూర్చిన బోధ యిదివరకు వేరువేరు పారశాలలందు నేర్పెడివారు. కాని యిపుడు అన్ని విషయాలు ఒక్కచోటనే నేర్పినచో, పూర్తిగ అర్హతగలవారు ఎందరో అచట తయారుకాగలరు.

నౌకరిలోనుండే నావికులలో ఎలక్ట్రికు పనులు బాగా తెలిసినవారుండుట చాల అవసరం.

1914 వ సం॥నకు పూర్వం యుద్ధ నౌకలో ఎలక్ట్రిసిటీ దీపాలకు మాత్రం ఉపయోగించేవారు. నేడు అది చాల ముఖ్యమయిన పరికరము. ఉన్న పరికరాలు చక్కగ వినియోగించుటపైనే నేటి నౌకలయొక్క యుద్ధంచేసే శక్తి, గమనశక్తి ఆధారపడియున్నవి. కావున మంచి నేర్పరులును, సురక్షితులునగు నావికులే ఉండవలెను.

టార్పెడో స్కూలులో ఉత్తీర్ణులయినవారు రాయలు ఇండియను నేవీలో పని పూర్తికాగానే, సివిలు పనులందు పెద్ద ఉద్యోగములకు అర్హత కలిగియుందురు. వారిలో ఉత్తములు వారంటు, కమిషను హోదాలు పొందుటకు అర్హులగుదురు.

భారతీయ నౌకాదళమునందు యింకో అభివృద్ధి సూచన యేమన, క్రొత్తగ సబుమెరైను ప్రతికూల సాధన పారశాల యొకటి స్థాపించుచున్నారు.

ఈ పారశాల యజమానిగానుండు ప్రధానోద్యోగి బ్రిటిషు రాయలు నేవినుండి వచ్చును. ఇతర ఉద్యోగులు బ్రిటిషు నౌకాదళము ఇండియను నౌకాదళము నుండిగూడ రప్పించబడుదురు. నేర్చుకునేవారు ఇండియను నేవీనుండి మిత్రమండలి దేశాలన్నింటినుండి రప్పించబడుదురు. ఈ పారశాల బ్రిటిషు సామ్రాజ్యం అంతకు (ఇంగ్లాండులో ఉన్నది తప్ప) పెద్దది. టార్పెడో స్కూలు యిపుడున్న ఆంటి సబుమెరైను స్కూలుకి బదులుగ నిర్వహింపబడును.

రాయలు ఇండియను నేవీవారి గన్నరీ పారశాలకూడ అభివృద్ధి చేయబడుచున్నది. ఈ పారశాల యిటీవలనే క్రొత్త భవనమునకు మార్చబడింది. వచ్చే యేడు యింకో పెద్ద భవనమునకు మార్చబడును. నౌకలోనుండు పెద్ద ఫిరంగులు ప్రేల్చడం అందు నేర్పెదరు.

యుద్ధం ప్రారంభమయినప్పటినుండి యీ గన్నరీ స్కూలులో నేర్చుకుంటున్నవారి సంఖ్య 15 రెట్లధికమయింది.

# వేరొక క్రొత్త నౌక.

## రాయలు భారతీయ నౌకాదళం.

రాయలు ఇండియను నేవీయందు, వేరొక క్రొత్త నౌక కొద్ది రోజుల క్రిందట సముద్ర యానం ప్రారంభించినది. ఇది జలాంతర్గాములను కొట్టుటకు, యితర పనులకు పనికివచ్చును.

గత 11 నెలలలో మన నౌకల సంఖ్య, యుద్ధారంభములో అనుకున్న ప్రకారం ఎక్కువ అభివృద్ధి చెందినది. ప్రతి నెల క్రొత్త నౌకలు భారతీయ రేవులలో నీట ప్రవేశించుచున్నవి. ఇంకను ఎన్నో తయారగుచున్నవి. ఇప్పటికి పని పూర్తియై తయారయిన నౌకల సంఖ్య భారతీయ నౌకా నిర్మాణ పరిశ్రమాభివృద్ధికి మంచి నిదర్శనముగ నున్నది. నౌక లెక్కువగుటతోబాటు, నౌకాదళోద్యోగులు, నావికుల సంఖ్య కూడ చాల పెరుగుచున్నది.



బ్రిటిషు యుద్ధ విమానం దాడి చేయగ లొంగిపోయిన జర్మను జలాంతర్గామిని బ్రిటిషు నౌక తాడుకట్టి రేవులలోనికి యీడ్చుట యిందు కాననగును. స్టీమరువచ్చి దాన్ని వశపరచుకొనువరకు విమానం పైన ఎగురుచు 13 గంటల సేపు దాన్ని కావలాకాచెను.

# యుద్ధ ఖైదీలకు లేఖలు.

హాంగుకాంగు, మలయా, బర్మాలందు యుద్ధంలో తప్పిపోయినట్లు ప్రకటింపబడిన సైనికోద్యోగులు, సివిలు ప్రజల బంధువులందరికి తెలియ జేయడమేమనగా, జపానువారి వశమునందు యుద్ధ ఖైదీలుగ నున్నవారికి యిపుడు లేఖలు వ్రాసుకోడానికి వీలున్నది. యుద్ధ ఖైదీల పేర్లు గల జాబితాలు జపాను ప్రభుత్వంనుండి యింకను రాలేదు. కాని, ముమ్ముందు యింకోవిధంగా తెలిపేవరకు లేఖలను, పోస్టుకార్డులను యీ దిగువ పైవిలాసములకు వ్రాసుకోవచ్చును :—

మిలిటరీ—ఉద్యోగి నెంబరు, హోదా, పూర్తి పేరు (విడివిడి అక్షరములతో) రెజిమెంటు, చిట్టచివరకు ఎక్కడ పనిచేయుచున్నట్లు తెలిసెను. ఇవన్ని వ్రాసి "బ్రిటిషు యుద్ధ ఖైదీ" అని చేర్చి, కేరాఫ్ ప్రిజనరు ఆఫ్ వారు ఇంఫర్మేషను బీరో, టోకియో అని వ్రాయాలి.

సివిలు ప్రజలు—ఇంటి పేరుతో సహా పూర్తిపేరు (విడివిడి అక్షరములతో), చిట్టచివరకు ఏ వూరులో వున్నట్లు తెలిసెనో ఆ వూరు పేరు ; బ్రిటిషు యుద్ధ ఖటుడు, కేర్ ఆఫ్ ప్రిజనరు ఆఫ్ వారు ఇంఫర్మేషను బీరో, టోకియో-అని వ్రాయాలి.

కవరలపై "యుద్ధ ఖైదీ టపా" అని వ్రాసి పోస్టు ముద్దర్లు అంటించ నవసరంలేదు. జపాను వారు అందలి వ్రాత చూచి సెంషరు చేయుట కష్టంగా నుండును, కనుక లేఖలు ఎంత క్లుప్తంగా వ్రాస్తే అంతమంచిది. పార్సెల్సు ప్రస్తుతం పుచ్చుకోరు.

# బ్రిటను నడుంబిగించింది.

## యుద్ధపరికరాల ఉత్పత్తి ఎక్కువగుట.

బ్రిటను ఉత్పత్తి శాఖమంత్రి ఆలివరు లిటిలు టనుగారు అమెరికా సంయుక్త రాష్ట్రములకు పోయి అచటివారికి రేడియో ఉపన్యాసమొసంగుచు "మేము ఎన్ని తయారుచేయగలమో అన్ని తయారుచేయుచున్నా" మనిరి.

"మా దేశ రాబడిలో నూటికి 60 వంతు యుద్ధం క్రిందనే వెచ్చించుచున్నాము. వ్యాపారం మామూలుగా సాగుటలేదు, మామూలు లాభాలులేవు, మామూలు సరకుల ఉత్పత్తిలేదు, అంతా యుద్ధానికి అవసరమగు సరకుల ఉత్పత్తియే జరుగుచున్నది. ఆ పని ఎన్నటికి మానము. టాంకులు, ఆయుధశకటాలు మున్నగునవి సాలునకు 257,000 చొప్పున తయారుచేస్తున్నాము. సాలునకు 40,000 పెద్ద ఫిరంగులు తయారుచేసి వాటికి 25,000,000 రౌండ్ల మందుగుండ్లు లక్షల కొలది చిన్న ఫిరంగులు, తుపాకులు తయారు చేస్తున్నాము. 1940 లో ఆఖరు మూడు మాసాల ఉత్పత్తికన్న యిది నూటికి 350 వంతు ఎక్కువ.

"విమానాల ఉత్పత్తి అప్పటికి యిప్పటికి నూటికి నూరు హెచ్చింది. వర్తక నౌకల ఉత్పత్తి 47% చొప్పున హెచ్చింది. అన్నిరకాల యుద్ధ పరికరాల ఉత్పత్తి గత 12 నెలలో నూటికి నూరు హెచ్చింది."

ఇంగ్లాండు యుద్ధానికి నడుంబిగించి పని చేయుచున్నదని తెల్పుచు, 33,000,000 జన సంఖ్యలో 14—65 మధ్య వయస్కులు 22,000,000 మంది తమ కాలం పూర్తిగ పరిశ్రమలలో పనికి వినియోగిస్తున్నారని లిటిలుటను గారు తెలిపిరి. 55 లక్షలమంది స్త్రీలు కర్మాగారములలో పనిచేయుచున్నారనియు; 76,000 స్త్రీలు సిపాయిలుచేయు పనులు చేయుచున్నారనియు, వారిలో 13,500 మంది పైన విమాన యుద్ధాలు జరుగుచుండగ దిగువ విమాన విధ్వంసక ఫిరంగులవద్ద సోల్జరులతో కలసి పనిచేయుచున్నారనియు చెప్పిరి.

కర్మాగారములందు కార్మికులకు, యజమానులకు యీ యుద్ధం ప్రారంభమయినప్పటినుండి తగవులు లేనేలేవనియు, ఖాళీగానుండిన ప్రతి ఎకరం భూమి సాగుచేయబడినదనియు తెలిపిరి. ఫాక్టరీ కూలివానికి మంత్రులకు ఒకే రకం భత్యాలొసంగబడుచున్నవనిరి.

"ఆంగ్లేయుడు సైనిక సేవకు పనికిరాకుంటే ఫాక్టరీలో పనికి కార్మికమంత్రిచే నియమింపబడును. ఆహారశాఖ మంత్రి వాని భోజనంలో గల ఘనమయిన రుచికరమయిన పదార్థములు లేకుండా చేయును. వర్తకశాఖ మంత్రి నియమం ప్రకారం గుడ్డ యిచ్చును. అతని భార్య ఫాక్టరీలో పనిచేయును, కోశాధికారి అధికంగా పన్ను విధించును. రాబడిలో మిగిలేది యుద్ధ నిధి నిలువాకు పంపాలి. అది మిగుల్చుకొన్నా కొనుక్కొనుటకు వస్తువులు లేవు. ఇది ఇంగ్లీషు వాని స్థితి. ఐదిండ్లలో ఒక యిల్లు—మొత్తం 13,000,000 యిండ్లలో—బాంబులచే నష్టపోయినను యింకను మేము విచారగ్రస్తులం కాలేదు." అని లిటిలుటనుగారనిరి.

---

# జపాను లోపాలు.

## సహనశక్తిలేదు: ఇదివరకున్న బలం యిపుడు లేదు

గత ఐదు నెలలలో జరిగిన యుద్ధ చర్యననుసరించి జపాను స్థితి ఎట్లున్నదో పరిశీలించుట యుక్తము.

పశిఫికు సముద్రప్రాంతములందు జపాను దీవులున్న నైసర్గిక పరిస్థితులనుబట్టి జపానుకి లాభం ఉంది, నష్టంకూడా వుంది. ఈ సముద్ర ప్రాంతాలకు ఇంగ్లండు అమెరికాలకన్న చేరువగ నున్నందున అక్కడకు ఎక్కువ సైనికులు ఎక్కువఫిరంగులు నౌకలు విమానాలతోను జపాను చేరి, ప్రారంభంలో విజయం పొందవచ్చును. అది నైసర్గిక పరిస్థితులనుబట్టి, సంఖ్యాధిక్యతనుబట్టి చేకూరక తప్పదు.

కాని ఆదిని విజయం చేకూర్చిన యీ నైసర్గిక పరిస్థితులే, విజయం పొందిన తరువాత ప్రతిబంధకములుగ మారవచ్చును. ఇపుడు మనకున్న కష్టాలు అపుడు జపానుకి సంభవించును. జపాను నావలు 4,000 మైళ్లవరకుపోయి వస్తూవుండాలి. ఇంత మేరా వారి విమానాలు కాపలా కాస్తూ వుండాలి. ఏదో ఒకేచోట కేంద్రీకరించి యుద్ధం చేసే సదుపాయం యికనుండదు.

ఓర్పు సన్నగిల్లుట.

జపాను తన చుట్టు 2,500 మైళ్ల యావరణలో ప్రదేశమంతా వశపరచుకొని కాపలా కాచి, ఆలోపల తన సైన్యాలకు సప్లయిలు అందజేసుకోడానికే శక్తిచాలని దేశం. జపాను బలంలో లోటు యిక్కడే వుంది. ఆధునిక యుద్ధ విధానమునందు ఓర్పుకి తగినంత వెనుక సత్తువ, నిలువ శక్తి జపానుకి లేదు.

మొదటి నెలలలో గెల్చుకొన్న ప్రదేశములందుండిన విశేషమగు ముడిపదార్థములను ఉపయోగించుటకు తగిన సుశిక్షితులును నేర్పరులును అగు పనివారుగాని యంత్రసామగ్రిగాని జపానుకి లేదు. తన శక్తి ఎంతవరకు పెరగాలో అంతవరకు పెరిగిన పిదప జపాను యుద్ధంలో దిగింది. ఉన్నదంతా వినియోగించింది, అంతకుమించి శక్తి సామర్థ్యాలు లేవు. సంయుక్త రాజ్యాలకు ముఖ్యంగా అమెరికాకు ఉత్పత్తి శక్తి యింకా పెరుగుచునే యున్నది. నిర్మింపగల నౌకలకు విలువయున్న ముడిపదార్థాలకు వాటిని ఉపయోగింప కావలసిన ధనసంపదకు అమెరికా దేశానికి మితియే లేదు. దానికి తోడుగ ఇంకా ఇంగ్లాండు-రష్యాల సంపద గలదు. అందుచే యీ విషయమున మిత్ర రాజ్యాలకు అమెరికాకు పోలికయే లేదు.

జపాను యింకా కొంతకాలం యిట్లు చొచ్చుకపోగలదేమో కాని, త్వరలో తానే ముట్టడిలో చిక్కుకునే స్థితి రాగలదు. దౌర్జన్యానికి గడంగిన సైనిక జాతి ముందంజవేసినపుడు, తిరిగి పడిపోయేవరకు చాల బలంగానున్నట్లే కనబడును. గత యుద్ధంలో జర్మనీ 1918 వ సం॥ జూలై 15 వ తేదిసరికి జయింపరానంత శక్తివంతంగానేఅగుపడెను, కాని మరి మూడు నెలలలో సంధికిదిగింది. జపాను అదే స్థితిలో నుంది. పోరుప్రారంభమునందు మాత్రమె తన శక్తినంతా జపాను చూపగల్గెను. అదియే దాని ప్రాణాంతకమగు లోపం.

జపాను గూర్చి ఒక భ్రమ తొలగించుకోవాలి. అది 1941 లో మన మనుకున్నంత బలహీనంగా లేదు. ఇపుడు మన మనుకో దగ్గంత బలవంతంగానూ లేదు. అతి దూరానయున్న శత్రువులయొక్క వలసరాజ్యాలపై యుద్ధ ప్రారంభంలో జపాను గెలుచుకుంది. కాని ఆ శత్రువులు చేరువై, శక్తిని కేంద్రీకరించి పైబడుసరికి జపాను ఘోరప్రమాదమునకు గురియగును.

మడగ్రలెక్కినట్లున్న జపాను అట్టే దూరం పోకముందే బోర్లపడక తప్పదు.

# పశిఫికు యుద్ధం : రెండో దశ.

## జపాను జయింపజాలదని జర్మను నిపుణుల అభిప్రాయం

పశిఫికు యుద్ధమునందు మొదటి దశలో గెలిచిన గెలుపు రెండో దశలో జపాను బడయజాలదనియు, యీ రెండో దశ యిపుడు ప్రారంభం కానున్నదనియు, సుప్రసిద్ధ వార్తా వ్యాఖ్యాతయగు మేజరు జార్జి ఫీల్డింగు ఇలియటుగారు దెల్పిరి. ఈ అభిప్రాయమును జర్మను నిపుణులే దెల్పుచున్నారు. గనుక జర్మనీ-జపానులకు ఎట్టి సఖ్యతగలదో దీనిబట్టి తెలియగలదనుచున్నారు.

1936 లోనే అడ్మిరలు గాడోగారు (జర్మను) యిట్లు వ్రాసెను ;—"హాంగ్‌కాంగు, సింగపూరు, ఫిలిప్పైన్సు దీవులను జపాను ఆక్రమించగల్గినా, వ్లాడివిస్టాకు, పెట్రోపోలొస్కు, నికోలాయిస్కు (రష్యను రేవులు) డచి హార్బరు, హవాయి, సామోవ (అమెరికా దీవులు) శత్రువుల చేతులోనున్నంత కాలం జపాను ఘోరమగు ప్రమాదమునకు లోనయియుండును. మిడ్వే దీవులు అతిదూరపు శత్రుకేంద్రంగానుండి, జపానుపై దాడికి ఉనికిపట్టుగా నుండగలవు."

జర్మను వైమానిక సైనిక యోధుడును, దూర ప్రాచ్య వ్యవహారదక్షుడును అగు కర్నలు వాను బ్యూలోగారు 1937 లో యిట్లు నుడివిరి :—"పాశ్చాత్యదేశాలకును జపానుకి యుద్ధం రెండు దశలుగా నుండును. మొదటి దశలో ఆకస్మికంగా కొట్టిన జపాను ప్రారంభ విజయంపొందినా, అది తాత్కాలికంగానే యుండును. తనకు నిజంగా పక్కలో కుంపటివలెనుండి చేతి కందకుండాయుండు శత్రు సైనిక శిబిరాలను వశపరచుకోజాలదు. రెండవ దశలో జపాను యంత్రాల కందకుండా యుండిన శత్రువు తిరుగుదాడి ప్రారంభించును. దాని నిరోధించుటకు జపాను తన శక్తినంతా ధారపోసి అలసిపోవును."

# ఇండియాకు సంయుక్త రాజ్యాల సహాయం.

## ఐదు సూచనలు.

సుప్రసిద్ధ విమర్శకుడు జార్జి ఫీల్డింగు ఇలియటుగారు యుద్ధ వ్యూహంలో ఇండియా స్థానంచాల ముఖ్యమయినదని తెల్పుచు, జూను 30 వ తేదిన "లుక్" అను పత్రికలో ఒక వ్యాసంవ్రాసిరి.

ఇండియా నైసర్గిక పరిస్థితుల ననుసరించి కష్ట సమయములందు ఇండియా రక్షణ తగ్గించబడిన దని వారనుచున్నారు.

సంయుక్త రాజ్యాలు ఇండియాకు చేయుచున్న సహాయమునందు ఐదు ముఖ్యాంశములను యీనిపుణుడు వర్ణించెను :—

(1) జపాను నౌకాదళం హిందూ మహాసముద్రములోను, బంగాళాఖాతమునుండి వెడలిపోవునట్లు పశిఫికు సముద్రంలో మిత్రమండలి నౌకాదళం ఒత్తిడి కలిగించుట.

(2) చీనా శత్రువుని నిరోధించుచు ఇండియాకుసహాయం తెంపులేకుండా చేస్తూవుండుటకై, చీనాకు విమానాలపైని, ఒంటెలు, మోటారులు, ఏనుగులు మున్నగు రవాణా సాధనము లన్నింటి నుపయోగించి ఆయుధ సహాయం పంపుట.

(3) ఇండియా సింహాళములందు విమానశక్తి నెక్కువ చేయుటకు అమెరికా ఇంగ్లాండు వైమానికులను పంపుట.

(4) విమానాల ఇంజనులు, టాంకులు, సకవచశకటాలు, యంత్ర సాధనలు యింకా ఎక్కువగ ఇండియాకు పంపుట.

(5) ఇండియా సైన్యమును పెంచుట.

---

# అలూషియం దీవులు - జపానుకి వల.

అమెరికా ఖండమునకు పసిఫికు ఉత్తర కొననున్న అలూషియను దీవులపై దాడిచేసి, అమెరికా నౌకాదళాన్ని కొంత అటుమరల్చి, దాని శక్తి కేంద్రీకరించబడకుండా చేయాలని జపాను యత్నించుచున్నది. దీని గూర్చి ఫుల్టను లెవినుగారు వార్తా విమర్శకుడు యిట్లు వ్రాసెను :—

"అలాస్కా రాష్ట్రంగూర్చి బెంగపెట్టుకొని మన నౌకాదళాన్ని కొంత అటు పంపించుతామనుకొని జపాను ఉత్తర పాసిఫికు దీవులపై దాడి చేసినది. కాని ప్రస్తుతం అలాస్కా భద్రత గూర్చి సైనికాధికారులు నౌకాదళాధికారులు ఏ మాత్రం చింతించుటలేదు."

---

# ఎడారి విజయం - ఎండమావుల ఉదకం.

బ్రిటిష్‌వారి సామ్రాజ్యం ప్రపంచమంతటను విస్తరించి ఉంది. అందువల్ల బ్రిటిష్‌వారితో యుద్ధం అంటే యావత్తు ప్రపంచంతోను యుద్ధం చెయ్యడంవంటిది. బ్రహ్మతో యుద్ధం చేయవలెనంటే బ్రహ్మాండం యావత్తూ జయించవలసి యుంటుంది. అదేవిధంగా బ్రిటిష్‌వారిని జయించవలెనంటే, ప్రపంచంలోని అనేక రాజ్యాలను జయించాలి. జర్మనీకి సరిహద్దు రాజ్యంగా ఉన్న పోలెండుమీదకు జర్మను సేనలు మొట్టమొదట దండెత్తి యుద్ధం ప్రారంభించినవి. ఆ పోలెండు రాజ్యమునకు అభయహస్తమిచ్చినది బ్రిటిష్‌వారే. ఏనాడు పోలెండుమీదకు జర్మనీ దండెత్తెనో, ఆనాడే బ్రిటిష్‌వారితో జర్మనీ యుద్ధం ప్రారంభించినది. ఉత్తర ధ్రువం మొదలుకొని దక్షిణ ధ్రువం వరకు యీ రోజున శత్రువులు ఉయ్యాల ఊగినట్లుగా, డోలాందోళనంగా యుద్ధం చేస్తున్నారు. బ్రిటిష్‌వారితో యుద్ధమునకు దిగుటవల్లనే, రష్యాతో యుద్ధం భేతాళయుద్ధంగా సాగుతోంది. రష్యాకు ఆయుధ సామగ్రులను సప్లయి చేయుచున్నది బ్రిటిష్‌వారు. రష్యాలో బ్రిటిష్ విమానాలే వెళ్లి కొన్ని రంగములలో పోరాడుచున్నవి. ప్రపంచములోనున్న రాజ్యాలలోకెల్ల బ్రహ్మాండమైన పెద్ద రాజ్యం ఏదనగా రష్యా రాజ్యం. అంత విస్తారమైన రాజ్యం ఇంకొకటి లేదు. ఇంగ్లాండు దేశం జర్మనీకంటె చాలా చిన్నరాజ్యం. జర్మనీకంటె అనేకరెట్లు పెద్దది రష్యా రాజ్యం. కాని, చిన్నరాజ్యమైన ఇంగ్లాండు మీదకు దండెత్తుటకంటె, బ్రహ్మాండమైన రష్యా మీద దండెత్తుటకు తనకు ఎక్కువ సాధ్యమైన పనియని హిట్లరు నిర్ణయించుకొన్నాడు. అందు

వల్లనే, ఇంగ్లాండుమీదకు దండెత్తకుండా క్రిందటి సంవత్సరం జూను మాసంలో రష్యామీదనే హిట్లరు యుద్ధం సాగించాడు. రష్యాతో రగడ పూర్తి అయితే, జర్మనీకి పునర్జన్మ ఎత్తినట్లే. రష్యాలోనున్న ఒక్క కాకసను పరగణాలోనికి ప్రవేశించుటకు సంవత్సరంనుంచీ సమరం సాగిస్తున్నాడు. ఈ సంగరం మహాసాగరంగా ఉంది. కాకసను పరగణాలో ప్రవేశించడం అంటే, జర్మనీకి అగ్నిప్రవేశంగా ఉంది. దానికోసమే, ఆఫ్రికా ఎడారులలోకూడా జర్మనుసేనలు యుద్ధం చేస్తున్నాయి. ప్రపంచంలోని ఎడారులలోకెల్ల బ్రహ్మాండమైన ఎడారి, యీ ఆఫ్రికా ఎడారి. త్రాగుటకు నీళ్లులేని అగ్నిగుండమువంటి ఎడారి అది. ఈ ఎడారిలో క్రిందటి సంవత్సరం అనేక మాసాలు జర్మను సేనలు యుద్ధంచేసి, విసిగి వేసారి, వెనుకకు మరలిపోయినవి. టొబ్రూకు కోటను జర్మనులు పట్టుకోలేకపోయినారు. తిరిగి యీ సంవత్సరం లిబియా ఎడారిలో యుద్ధం మరల ప్రారంభించి చచ్చిచెడి చేయంగల విన్నపములన్నట్లుగా టొబ్రూకు కోటను జర్మనులు క్రిందటి వారం వశపరచుకొన్నారు.

ఎడారిలో యుద్ధం అయినతర్వాత, ఇక ముందు జరుగవలసిన కార్యకలాపం ఇంకా అగమ్యగోచరంగానే ఉంది. కాని, టొబ్రూకు కోటను పట్టుకొనగానే, విజయలక్ష్మిని చేబట్టినట్లుగానే, జర్మనులు చంకలు కొట్టుకొనుచున్నారు. ఎడారిలో ప్రయాణాలు చేసినవాళ్లకు ఎంత దాహంగా ఉంటుందో, అంతకన్నా ఎక్కువ రాజ్యదాహంతో జర్మను సేనలు ఆఫ్రికా ఎడారులలో ముందుకు పరుగెత్తుచున్నవి. ఎడారిలో దాహం ఎంత ఎక్కువగా అవుతుందో, దాహం త్రాగుటకు నీళ్లు అంత కరవై ఉంటాయి. నీళ్ల కరవు మాత్రమే కాకుండా, ఎండమావులలో నీళ్లు ఉన్నట్లుగా భ్రమకూడా కలుగుతూ ఉంటుంది. ఆ ఎండమావులలోని నీరు ఏవిధంగా భ్రమపెట్టి ఎడారి బాటసారులను, సారెసారెకు భ్రమింపజేసి విసిగి వేసారునట్లు చేస్తూఉండునో, అదేవిధంగానే జర్మను సేనలకు విజయలక్ష్మికూడా అదిగో ఇదిగో అన్నట్లుగా భ్రమింపజేసి జర్మను సేనలను ముందుకు తీసికొని పోతూ ఉన్నది.

టొబ్రూకును వశపరచుకొనడంవల్ల జర్మనులు విజయలక్ష్మిని చేబట్టినామని, యీ రోజున భ్రమిస్తున్నారు. ఆ ఎడారి విజయం ఎండమావుల ఉదకం వంటిది. ముందంజ వేసిన కొలదీ, ఇంకా ముందుకు యీడ్చుకొని పోతూ ఉంటుంది. ఈ విధంగా లిబియాలో యుద్ధం పూర్తికాగానే యీజిప్టులోనికి జర్మనులు ప్రవేశించారు. ఇది అయిన తర్వాత ఇంకా ముందుకు పోతారు. ముందుకు పోవడమే తమకు విజయమని జర్మనులు భ్రమిస్తున్నారు. కాని, ముందుకు పోయినకొలదీ జర్మను సేనలు దూరప్రాంతాలలో విస్తరించి పల్చబడుతూ ఉంటాయి. ఉత్తరమున, నార్వే రాజ్యం మొదలుకొని, ఫ్రెంచి కోస్తావరకున్నూ, ఆఫ్రికా కోస్తా అంతటను, ఆవరించుకొని యుండవలసిన అగత్యం జర్మను సేనల కిప్పుడు కలిగింది. రష్యా యుద్ధరంగములో జర్మను సేనలు కేంద్రీకరించి నిలువబడవలసినవై యున్నవి. ఇటువంటి పరిస్థితులలో, జర్మను సేనలకు యుద్ధరంగం మూడు ఖండాలలో విస్తరించుచున్నది. యూరోపు ఖండంలోను, ఆఫ్రికా ఖండంలోను, ఆసియా ఖండంలోను విస్తరించడమే తమకు విజయమని జర్మనులు భ్రమిస్తున్నారు. కాని, మూడు ఖండాలలో జర్మను సేనలు విస్తరించినకొలదీ, మూడు చెరువుల నీళ్లు త్రాగక తప్పదు. బ్రిటిష్‌వారితో యుద్ధం చెయ్యడం; అంటే, ప్రపంచం అంతటా సేనలను విస్తరింపజెయ్యక తప్పదు. అటువంటి పరిస్థితి శత్రు సేనలకు ఎప్పుడు ఏర్పడిందో, అప్పుడే శత్రువు యొక్క బలం నీరసించుచున్నదనిన్ని అంతకంతకు పల్చబడుచున్నదనిన్ని గ్రహించవలసియున్నది. ఆ రీతిగా జర్మనుల బలం జగమంతటా విస్తరించడమే, పల్చబడుటయే, బ్రిటిష్‌వారికి విజయకారణం కాగలదు.

---

“ దిగు, దిగు దిగునాగ........ ”

యుద్ధం ప్రారంభమయిన మొదటి వేసంగిలో హిట్లరు :—

“ మన యుద్ధంలో జయిస్తున్నాం ” అనెను.

రెండో వేసంగిలో హిట్లరు :—

“ మనం జయిస్తాము ” అన్నాడు.

మూడో ఏడు వసంతరుతువులో హిట్లరు :—

“ మనం జయించాలి ” అంటున్నాడు.

దీనిపై వ్యాఖ్యానం చేయ నవసరంలేదు.

---

## మద్రాసు పటాలముల జనహాని.

మదరాసు పటాలములో యీ దిగువ జనహాని కలిగిందని తెలుపుటకు విచారించుచున్నాము :—

నెంబరు. హోదా. పేరు.

అదివరకు తప్పిపోయినట్లు యిపుడు చనిపోయినట్లు తెలుపబడినవారు.

ఐ.ఎం.ఎస్. లెఫ్టినెంటు. కె. ఎస్. రాజగోపాలాచారి.

చనిపోయినవారు.

ఐ.ఇ.—
61603 సేపరు ... కె. నారాయణను
62885 సేపరు ... రంగ.
19929 సేపరు .. కుష్ఠలింగం.

గాయపడినవారు.

63031 సేపరు . చింతామణి.
63658 సేపరు ... ధనపాలు.
18072 సేపరు . ఫ్రాంసిసు.
13944 హవల్దారు. ఖాదరు మొహిఉద్దీను.
1883 మేసు నౌఖరు. క్రిష్ణస్వామి.
63560 సేపరు ... మునిస్వామి
18273 సేపరు ... సుబ్రహ్మణ్యం
63561 సేపరు ... నరశింహ.
65902 సేపరు .. రాజు.

అదివరకు తప్పిపోయినట్లు ప్రకటింపబడి, యుద్ధ ఖైదీలుగ శత్రుదేశంలో నున్నట్లు యిపుడు రూఢియైనవారు.

మదరాసు సేపర్లు, మైనర్లు—
16221 సేపరు . అహమ్మదు ఖాను.
12897 సేపరు .. చిన్నప్పను.
16726 సేపరు .. దేవరాజు.
14796 సేపరు ... ముత్తుసామి.
15014 సేపరు .. ఏంజలి.
13002 సేపరు . పరశురామను.
17747 సేపరు పత్తావి.
15192 సేపరు .. సుబ్రహ్మణ్యం.

ఐ.ఎస్.సి —
ఎ 2670 సిగ్నలరు .. జి. ఎస్. కరియప్ప.
ఎ 2681 సిగ్నలరు .. శంకున్ని నాయరు.
ఎ 3615 సిగ్నలరు .. టి. తుసియనాథను.

ఆర్ ఐ.ఎ.ఎస్ సి —
ఎం.టి 503674 స్పేపరు .. కుమారస్వామి.
ఎం.టి. 895349 సిపాయి .. ఎస్. కుప్పుస్వామి.
ఎం.టి. 895362 సిపాయి ... మునిస్వామి.
ఎం.టి. 899541 సిపాయి ... పొన్ను నాయరు.

అదివరకు తప్పిపోయి యిపుడు చేరినవారు.

ఇండియను ఇంజనీర్సు—
17536 సేపరు ... నటేశను.
60428 లా/నాయకు. ఎల్. శివరామను.

నెంబరు. హోదా. పేరు.

### వైస్రాయి కమిషను ఉద్యోగులు.

చనిపోయినవారు.

100025 జమెదారు లక్ష్మణను

గాయపడినవారు.

సబాల్టరు .. అలగిరిస్వామి.

కనబడనివారు.

ఐ ఎం డి. జమేదారు. ఎస్. సి పాండ్య.

యుద్ధ ఖైది

ఐ.ఎం.డి. అసిస్టెంటు సర్జను. ఇ. పి. పెరైరా

### ఇతర తరగతులు.

గాయపడినవారు.

సేపర్లు, మైనర్లు—
13020 సేపరు అబ్దుల్ గఫూరు.
60994 సేపరు .. ముత్తుసామి

ఐ ఎస్ సి.—
ఎ 1468 సిగ్నలరు ఎ. శంకరయ్య.

ఆర్.ఐ ఎ ఎస్.సి —
ఎం.టి 899433 సేపరు .. బాలకృష్ణ.
ఎం టి. 891138 సేపరు ఎల్. కురుప్పనన.
ఎం టి. 899921 సేపరు ... కొమ్మూరు సీతారామస్వామి.
ఎం టి 895864 సేపరు ... కృష్ణ రెడ్డి.
ఎం.టి 899157 సేపరు పెరుమాళు.
ఎం.టి 900037 సేపరు . రామను నంబియారు.

ఐ.ఎ ఒ.సి.—
ఒ/109873 సేపరు కె.ఎస్. పెరుమాళు.

ఐ ఒ.ఎస్ సి —
జి.ఎస్.ఎం.5254 ఎల్.డబ్ల్యు. మునుస్వామి.
జి.ఎస్.ఎం.9484 మేసు నౌఖరు. పెరియస్వామి.

కనపడినవారు.

64669 సేపరు . కె ఆర్. బాలకృష్ణపిళ్లె.
19605 సేపరు .. గుడ్ల అప్పారావు.
19[illegible]96 సేపరు . మరుదపిళ్లె
64213 సేపరు మహమ్మదు హుస్సేను.
17208 లా/నాయకు. జోసెఫ్.

అదివరకు తప్పిపోయి యిపుడు యుద్ధ ఖైదీలుగా నున్నవారు.

17680 లా/నాయకు. ముగనవేలు.
16915 నాయకు .. ముత్తు.
ఎ 1764 పి. లాన్సు నాయకు. జి. కేశవ రావు.
ఎ 1624 నాయకు ... ఆర్. పెరుమాళ్లు.

అదివరకు తప్పిపోయి యిపుడు పనిలో చేరినవారు.

63136 సేపరు ... మరప్పను.
64116 సేపరు ... నారాయణస్వామి.

ఐ.ఇ —
19066 లా/నాయకు. జాన్ పున్నయ్య.

కనపడనివారు,

ఇండియన్ ఫిరంగిదళం—
టి. కెప్టను. ఎ. ఎన్. నారాయణ.

MADRAS. PRINTED AND PUBLISHED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.